# మంత్ర శాస్త్రము




- శ్రీ ఆదిపూడి వేంకట శివ సాయిరామ్

MOHAN PUBLICATIONS
దేవుళ్ళు
Devullu.com

www.Devullu.com

# మంత్రశాస్త్రము

మంత్ర -శాస్త్రముపై 1701 మంత్రములు గల

— ఏకైక గ్రంథరాజము —

గ్రంథకర్త, సంకలనకర్త
ద్విశతాధిక గ్రంథ సంకలనకర్త, జ్యోతిష శిరోమణి
డా॥ ఆదిపూడి వేంకట సాయిరామ్
B.Sc., L.L.B., M.A. (Jyothisham), M.Sc., Psychology
గుంటూరు



ప్రకాశకులు : ఫోన్ : (0883) 2462565

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట
రాజమండ్రి-533 101.
www.mohanpublications.com



# ఒకమనవి

- గురుముఖతామాత్రమే ఈ మంత్రములను జపించవలెను.
- గురూపదేశము లేకుండా మంత్రానుష్ఠానము చేయరాదు.
- ముఖ్యముగా బీజాక్షరమంత్ర ఉచ్ఛారణలో దోషములు ఉండరాదు.
- ఈ గ్రంథము అనేక వ్యయప్రయాసలకోనర్చి రూపొందించటమైనది.
- అనేకమార్లు పరిష్కరించి ఈ గ్రంథమును అందించుట జరిగినది. ఇంకా ఏమైనా అక్షర దోషములు ఉన్నచో మలి ముద్రణలో సవరించగలవారము.
- మంత్రోపదేశ విషయములో సందేహము గలవారు రచయితను సంప్రదించగలరు.
- ఈ గ్రంథములోని మంత్రసిద్ధిపై ఎటువంటి ప్రమాణము చేయుట లేదని ఇందు మూలముగా తెలియజేయడమైనది. వారి వారి శ్రద్ధాభక్తులు,అనుష్ఠాన ప్రక్రియ, మంత్రోచ్ఛారణ జపసంఖ్య ననుసరించి ఫలితములు కనబడును.
- దయచేసి సరదాతో, అపనమ్మకముతో, నాస్తికత్వముతో వివాదాస్పదమైన ఆలోచనలతో గాని ఈ పుస్తకమును పరిశీలించకండి, వ్యాఖ్యానించకండి.

# అంకితం



విజయవాడ ఇంద్రకీలాద్రిపై వెలసియున్న
శ్రీకనకదుర్గాదేవి అమ్మవారికి ఈ గ్రంథమును అంకితము
యిస్తూ

**EVERY ONE HAS A REASON TO READ**
FROM UN REAL TO REALITY
FROM DARKNESS TO LIGHT
FROM DEATH TO IMMORATLITY

రచయిత
డా॥ ఆదిపూడి వెంకట శివసాయిరామ్
(లేఖిఖా చైతన్య)

భక్తికెరటం-ఆధ్యాత్మిక సాగరం-దైవకటాక్షం-ముక్తితీరం
ఆదిపూడి వారి పుస్తకాలు

చదవండి! చదివించండి!!

# ముందుమాట

ఒక్కొక్క ఆరాధన గ్రంథములు విడుదుల సందర్భము ఎంతో మంది పాఠకుల నుండి మంచి ప్రోత్సాహము లభిస్తున్నవి. ఈ క్రమములో నా సోదర సమానులైన శ్రీకొలగంటి శ్రీమన్నారాయణ మంత్రశాస్త్రం పై ఒక రచన చేయమని ప్రోత్సహించి ఈ గ్రంథరచనకు తన సహాయ సహకారములు పూర్తిగా అందించినారు. సుమారు 3సం॥క్రితం ప్రారంభించిన ఈ గ్రంథము పూర్తి చేయుటకు చాలా సమయము వెచ్చించి యున్నాము. ఈ గ్రంథమును చక్కగా పరిష్కరించి సకాలములో అందించిన

శ్రీ ఆచార్యహరిశివకుమార్ గారికి, మరియు శ్రీకొలగంటి శ్రీమన్నారాయణగారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఇది ఒక అపూర్వ గ్రంథము. ఈ గ్రంథములో అనేక మంత్రములు పొందుపరచబడినవి. ముఖ్యముగా స్థలభావమును దృష్టిలో నుంచుకుని, అన్ని మంత్రములకు మంత్రసిద్ధి, ప్రయోజనము మాత్రమే యిచ్చుట జరిగినది. కావున పాఠకులకు ఈ గ్రంథమునకు పరిపూర్ణముగా విజయము చేకూరుస్తారని ఆశిస్తూ

డా॥ఆదిపూడి

మహాశివరాత్రి పర్వదినము

16-02-07





# మా మనవి

ఇది వరకు మేము ప్రచురించిన

**శ్రీగణేశారాధన, నవగ్రహారాధన, శివారాధన, సుబ్రహ్మణ్యా రాధన, హనుమదారాధన, శ్రీసాయిఆరాధన, శ్రీలక్ష్మిఆరాధన, నిత్యజీవితములోరుద్రాక్షలు, నిత్యజీవితములో నవగ్రహాలు, నిత్యజీవితములో సాలగ్రామములు, నిత్యజీవితములో నవరత్నాలు, నవగ్రహరెమిడిస్, నవగ్రహవైభవము, నవగ్రహదర్శనమ్, శ్రీదేవీలీలామృతం**

అత్యద్భుతముగా ప్రశంసలు అందుకున్నవి అందుచే

డా॥ ఆదిపూడి వేంకట శివసాయిరామ్ వారిచే

## మంత్ర-శాస్త్రము

అనే పుస్తక రాజమును అందించినాము.
కావున ప్రతి ఒక్కరు ఇది పారాయణ చేయదగినది.
చదవటానికి ఇచ్చినచో మళ్ళీ ఈ పుస్తకము తిరిగి మీ వద్దకు రాదు
అంతటి అమూల్య గ్రంథము..
మంత్రశాస్త్రం గురించి పూర్తి వివరణాత్మక గ్రంథం



# విషయసూచిక



మీ పుట్టినతేదీ,
సంవత్సరము,నెల,మరియు పుట్టిన సమయము, పుట్టిన ప్రదేశముతో మీ సమస్య వ్రాస్తూ మాకు రూ.500/- M.O ద్వారాగాని మరియు D.D (ఆదిపూడి సుజాతదేవి పేరుమీద) పంపినచో రెమిడీస్ తెలియజేయగలవారము.

కుజ దోష నివారణ కొరకు,
కాలసర్పదోష నివారణ కొరకు,
నాగదోష నివారణ కొరకు, అత్యంత విలువైన, అద్భుత, రెమిడీస్ కొరకు సంప్రదించగలరు.

నవగ్రహ అనుగ్రహం కొరకు , నవగ్రహ హోమము
కాలసర్పదోష నివారణ కొరకు , నాగ ప్రతిష్ఠ
వాస్తు దోష నివారణ కొరకు , వాస్తు హోమము.
ధనప్రాప్తికి మరియు సకల కార్య సిద్ధికి
శ్రీ లక్ష్మీగణపతి హోమము

వీటి కొరకు సంప్రదించగలరు :


సాయి జ్యోతిషవాణి
4-7-84, కొరిటెపాడు, గుంటూరు -7 ఫోన్: (0863) 2353321

## ఈ గ్రంథమునకు సంప్రదించిన గ్రంథములు

1. సర్వదేవతా మంత్ర రత్నావళి
2. బాలత్రిపుర సుందరస్తోత్ర కదంబం
3. నవగ్రహారాధన
4. ఆదిత్యారాధన
5. శ్రీ గణేశోపాసన
6. గణేశోపాసన
7. శ్రీలక్ష్మీ ఆరాధన
8. సుబ్రహ్మణ్యారాధణ
9. శివారాధన
10. శనిగ్రహారాధన
11. హనుమధారాధన
12. పాశుపత తంత్రము
13. సర్ప తంత్రము
14. మంత్ర మహోధధి-1
15. మంత్ర మహధధి-2
16. దత్తాత్రేయ మూలికాతంత్రము
17. ప్రత్యంగిరా కృత్య తంత్రము
18. మంత్రానుష్ఠాన చంద్రిక
19. మంత్రసిద్ధి
20. మంత్రసాధన
21. దత్తాత్రేయ తంత్ర విద్య
22. శ్రీదుర్గా తంత్రము
23. మహాలక్ష్మి తంత్రము
24. శ్రీగురు తంత్రము

---

బ్రహ్మశ్రీ సత్యనారాయణ సిద్ధాంతిగారికి,
శ్రీవంగిపురపు వీరబ్రహ్మదైవజ్ఞగారికి
శ్రీస్వామి మధుసూదన సరస్వతిగారికి,
శ్రీభాసురానంద సరస్వతిగారికి,

నా హృదయపూర్వక పాదాభివందనములతో .......

---

డా॥ఆదిపూడి





స్థాపితం : 1985

శ్రీ ఆదిపూడి వేంకట శివసాయిరామ్ గారి గౌరవ సంపాదకత్వములో

(ఏమి నిన్ను పేక్షింతునా)

# ఓమ్ శ్రీసాయిరామ్

శ్రీ సాయితత్త్వ ప్రచార మాసపత్రిక

## గత 20 సంవత్సరములగా నిరాటంకముగా శ్రీసాయిబాబాతత్త్వ ప్రచారము చేస్తున్న ఏకైక మాస పత్రిక

వ్యవస్థాపకులు: గురుదేవులు శ్రీ ఆదిపూడి మోహనరావు మహరాజ్ గారు

గౌరవ సంపాదకులు: శ్రీమతి ఆదిపూడి దుర్గాంబ మోహనరావు

**శాశ్వత నిధి**

| | |
|---|---|
| పోషకులు : | రూ. 1,116/- |
| రాజపోషకులు : | రూ. 2,116/- |
| మహారాజపోషకులు: | రూ. 3,116/- |

**చందా వివరములు**

| | |
|---|---|
| సంవత్సర చందా : | రూ. 54/- |
| 2 సంవత్సర చందా | రూ. 100/- |
| జీవితచందా | రూ. 540/- |

(5వాయిదాలలో చెల్లించవచ్చును.

మీ చిరునామాతో మాకు ఒక పోస్టుకార్డు వ్రాసిన వారికి ఓమ్‌శ్రీసాయిరామ్ మాస పత్రిక ఒకనెల ఉచితముగా పంపగలవారము.

మీ చందాలు ఎం.ఓ ద్వారాగానీ డి.డి. ద్వారాగా నీ
శ్రీ కె.రామకోటేశ్వరరావు, కార్యదర్శి
4-7-84, గాంధీబొమ్మ బజార్, కొరిటిపాడు, గుంటూరు - 7
కు పాతవారు చందా నెంబరువేసి పంపవలెను. క్రొత్తవారు చందాదారుడను అని వ్రాయవలెను.



## మంత్రానుష్ఠానమునకు యోగ్యస్థలములు

జపమొనరించుటకు ఈ క్రింది ప్రదేశములు యోగ్యమైనవని చెప్పబడినవి. 1.పుణ్యక్షేత్రము 2.నదీతీరము 3.గుహ 4.పర్వతాగ్రహము 5.తీర్థప్రదేశము 6.సముద్ర సంగ ప్రదేశము 7.పవిత్ర వనము 8. విజనములగు (జనులులేని) ఉద్యానవనములు 9. బిల్వవృక్షము క్రిందభాగము 10. దేవాలయము 11. వసతి గృహములో సూర్యునకు అభిముఖము లేదా దేవమందిరమున్న ప్రదేశము యోగ్య ప్రదేశములుగా చెప్పబడినవి.

మన గృహములో ఎంత జపమొనరించితిమో అంతయే ఫలము లభించును. అదే జపము గోశాల (ఆవుకట్టిన ప్రదేశము)లో చేసిన నూరురెట్లు, నదీతీరమున నూరువేల రెట్లు, శివసన్నిధిలో కోటిరెట్లు ఫలము నొసంగును. గంగాదిపుణ్య తీర్థక్షేత్రములం దొనరించిన జపము అనంత ఫలము నొసంగును.

నేలయందు కూర్చొని జపమొనరింపరాదు. అట్లు చేసినచో దారిద్ర్యము నొసంగును. రాతిమీద కూర్చొని జపమొనరించిన వ్యాధిని, కర్రచెక్క పీటయందుకూర్చొని జపమొనరించిన దౌర్భాగ్యమును. గడ్డిపై కూర్చొని జపమొనరించిన అపకీర్తి చిగుళ్ళపై కూర్చొని జపమొనరించిన చిత్తచాంచల్యమును కలుగచేయును. అందుచే జపము చేయునప్పుడు ఆసనము వాడవలయును. ఆసనముగా లేడిచర్మమునుపయోగించిన జ్ఞానసిద్ధి, పెద్దపులిచర్మమోక్షము, దర్భాసనము మంత్రసిద్ధి చిత్రాసనము సర్వార్థ సాధకము కాగలదు. కావున జపమొనరించువారు దర్భాసనము, చిత్రాసనము వాడుట సర్వశ్రేయోదాయకము.

## జపసంఖ్య, జపమాలా విశేషము

జపము చేయునప్పుడు ఎంత జపము చేసినామో తెలియుట చాల ముఖ్యము. లెక్కలేకుండా చేసిన జపము వ్యర్థము. కావున జపమెంత చేసితిమో తెలియుటకు జపమాల ముఖ్యమైనది. జపమాలకు 1.తులసి 2.రుద్రాక్ష 3.స్ఫటికములు 4. పగడములు 5. తామరపూసలు 6. మణులు శ్రేయోదాయకములు. కావున పైన చెప్పిన వానిలో వేటినైనను 108గాని లేదా 54 గాని మాలగా కట్టించుకుని జపమునకే వాడవలయును. జపమాల కంఠమున ధరింపరాదు. జపమొనరించునపుడు జపమాల ఇతరులకంటబడరాదు. కావున జపమాలను సంచిలో నుంచి దానిని చేతికి తగిలించుకుని జపమొనరించుట శ్రేయోదాయకము.

జపమొనరించునప్పుడు జపమాలలోని పూసలను లెక్కపెట్టుకు మధ్యవ్రేలునడిమి భాగమున జపమాలనుంచుకొని బొటనవ్రేలితో పూసలను తనవైపు త్రిప్పుకొనవలయును. అంతేగాని బయటకు త్రిప్పరాదు. అట్లు చేసిన ఆజపము నిష్ఫలము. ఆ రోజు ఎంత జపమొనరించితిమో లెక్కపెట్టి ఆ సంఖ్య జపఫలమునాయాదేవతకు ధారపోయవలెను.

జపమొనరించునప్పుడు సగము మూసిన కండ్లతో ఇతర దృష్టిలేకుండా ఆదేవతయందే మనస్సు లగ్నమొనరించి యుండుట సర్వోత్తమము. ఈ నియమములను పాటించి జపమొనరించిన శీఘ్రముగా ఆ తపస్సు ఫలించును.

## ఆసనములు-ఫలములు

తెలుపురంగు గల ఆసనముపై గూర్చుండి జపము చేయుట ప్రశస్తము. ఎరుపురంగుగల ఆసనమునందు జపమొనర్చుటవలన మంత్రదేవత స్వాధీన పడగలదు. నిత్యము ఆచరించు జపమునందు పద్మాసనము యోగ్యమై శాంతిని మంత్రవశ్యమును గావించగలదు. వస్త్రముపై కూర్చుండుట దుఃఖప్రదము. చెక్కపై కూర్చుండుట వలన ఫలశూన్యము, కృష్ణాజినము(జింక చర్మము) దర్భాసనము జ్ఞానప్రాప్తిని కలిగించగలవు. పులితోలుపై కూర్చుండిన మోక్షము, సంపదలు కలగును. కంబళిపై కూర్చుండి జపము చేయుట వలన సర్వసిద్ధులు లభించగలవు. "మంత్రసిద్ధిఃశాసనే" అని చెప్పి యుండుటచే దర్భాసనము జ్ఞానకారణమేగాక మంత్రసిద్ధి నొసంగగలదు.

గడ్డియందు గూర్చుండుట వలన కీర్తిని హాని సంభవించగలదు. చిగురుటాకులపై కూర్చుండి జపమొనర్చిన చిత్తవై కల్యము ప్రాప్తింపగలదు.

ఆకుపచ్చని ఆసనమును మోహనకర్మలయందుపయోగించవలెను. ఇతరులను హింసించు కర్మలయందు నల్లని ఆసనమును, దేశమునకు, వ్యక్తులకు శాంతి గూర్చు కర్మలయందు తెల్లని ఆసనమును, రాజ,స్త్రీ,జనాది వశీకరణమునందు ఎరుపురంగు ఆసనమును ఉపయోగించవలెను.

## షట్కర్మలయందాసనములు

పుష్టిని గూర్చుకర్మలయందు పద్మాసనము యోగ్యమైనది. శాంతిని గూర్చు సాధనయందు స్వస్తికాసనము ముఖ్యమైనది. ఆ విధముగానే వశ్యకర్మలయందు భద్రాసనము, ఆకర్షణయందు సుఖాసనము, స్తంభన విషయమునందు వీరాసనము, విద్వేషణమునందు కుక్కుటాసనము, ఉచ్చాటన యందు అర్ధస్వస్తికాసనము, మారణకర్మలయందు వికటాసనము,ప్రశస్తములై యున్నవి.

వశీకరణ విద్యలందు శీఘ్రఫలసిద్ధి కొరకు కప్పచర్మమును ఆసనముగాను పయోగించ వలెను. ఆ విధముగానే ఆకర్షణమునందు పులిచర్మమును, స్తంభనయందు ఏనుగు చర్మమును, విద్వేషణమునందు గుఱ్ఱపు చర్మమును, ఉచ్చాటనమునందు ఒంటెచర్మమును, మారణ కర్మలయందు గేదె చర్మమును ఆసనములుగానుపయోగించిన ఫలసిద్ధి త్వరితముగా చేకూర గలదు. మోక్ష విద్యయందు కృష్ణాజినము శ్రేష్ఠము. ఇతరములైన అన్ని సాధనలయందు దర్భాసనము ప్రశస్తమైయున్నది.

ఈ విధముగా దెలుపబడిన మృగచర్మములు పురుష మృగచర్మములై యుండవలెను. స్త్రీమృగచర్మము మారణకర్మయందు మాత్రమే ముఖ్యముగా గ్రహించబడునదై యున్నది.

## జపస్థానములు

ఏదైనను ప్రతి ఫలమును గోరిచేయు జపములకు యోగ్యమైన స్థానములు: సముద్రతీరము, నదీతీరము శివుడులేక విష్ణువు యొక్క ఆలయములు-శక్తిదేవాలయము, గోశాల,మఱ్ఱి,ఉసిరిగ, చెట్లయొక్క మూల ప్రదేశము. సన్యాసులు వసించెడు మఠములు, తులసీవనము, మరియు నిర్మలము పవిత్రమునకు తావులయందెచ్చటైనను జపానుష్ఠానము గావింపవచ్చును. మనస్సునందు వేదనను విడనాడి, నిశ్చల చిత్తముతో మౌనవ్రతము గైకొని ఇతరులతోటి ఏ విధమైన సంబంధము లేకుండా జపమును గావించిన యెడల సిద్ధినొసంగగలదు.

వశ్యకర్మలను తూర్పుముఖముగా గూర్చుండియు, ఆకర్షణ కర్మలను ఆగ్నేయాభి ముఖముగాను, మారణ కర్మలను దక్షిణముఖముగాను, విద్వేషణ కర్మలను నైరృతి ముఖముగాను, స్తంభనకర్మలను పశ్చిమాభిముఖముగాను. ఉచ్చాటనకర్మలను వాయువ్యముఖముగాను, శాంతికర్మలను ఉత్తరాభిముఖముగాను మోక్షకర్మలను ఈశాన్యదిఙ్ముఖముగాను గూర్చుండి సాధించవలెను.వశీకరణ కర్మల నిమిత్తంగా తూర్పుముకముగాను, ప్రాణులకు హింస గొల్పు విషయములందు పశ్చిమ ముఖముగాను, ఇతరములైన అన్ని కర్మల యందు ఉత్తర ముఖముగాను మంత్ర యంత్ర తంత్రములను క్రియలను నిర్వహించవలెను. ఆకసము వంక జూచుచు. క్రిందికి జూచుచు జపము గావించుట అన్ని కర్మల యందునిషేధించబడినది.

## జపబేధములు

1.వాచిక జపము,అనగా అందరికీ వినిపించు విధముగా మంత్రమునుచ్చరించు,
2. ఉపాంశుజపము, శబ్దము వినిపించకుండా పెదవులు మాత్రమే కదులచు ఆచరించునది.
3. మానసికజపము. శరీరము నందే అవయమును కదల్పక స్థిరదేముద్రై మనస్సునందే మంత్రమును జపించుట ఈమూడు విధములైన జపములందు మానసిక జపము ఉత్తమఫలదాయకము, ఉపాంశుజపము మధ్యమము వాచికజపము అధమము అనియెరుంగవలెను.

షట్కర్మలయందలి వశ్యము మరియు శాంతికపౌష్టిక కర్మలకు, ఆకర్షణ విధియందు మానసిక జపము యోగ్యము స్తంభనము. విద్వేషణము అనుకర్మలయందు ఉపాంశుజపము ప్రశస్తము. మిగిలిన రెండు కర్మల యందు వాచిక జపము శ్రేష్ఠము.

## మంత్ర బేధములు

లింగభేదముచే మంత్రములు ముప్విధంబులుగా నున్నవి. మంత్రము యొక్క చివరిభాగము "స్వాహా" అను వాక్యముచే ముగియుచుండిన అది పురుషమంత్రముగా నెరుంగవలెను. ఆ విధముగానే ''నమః'' ఈఅను వాక్యముచే మంత్రము సమాప్తమగుచుండిన అది స్త్రీ మంత్రమని గుర్తెరుంవలెను. "వషట్" అను వాక్యముచే మంత్రము అంతమగుచుండిన అది నపుంసక మంత్రమని దెలియవలెను.

## జపమాలాఫలములు

మంత్రమును జపించుట కుపయోగింపదగు మాలలు మణులు శంఖములతో గూర్చినదైన ధార్మిక కార్యములందుపయోగింపదగియున్నది ముత్యముల మాలచే విద్యా సంబంధమైన జపమొనర్చుటయోగ్యము ఐశ్వర్యముల గోరువారు తామర పూసల మాలనుపయోగింపవలెను. రుద్రాక్షమాల అన్ని కార్యములందు ప్రశస్తమైయున్నది.

కోరికలు నెరవేరుటకు, వశీకరణ కర్మలయందు, రత్నములతో కూర్చబడిన మాలగానీ లేక స్ఫటికమాలాగానీ ఉపయోగించదగి యున్నది. ఏనుగు దంతములచే చేయబడిన మాల ఆకర్షణప్రదము. పసుపుకొమ్ములచేచేయబడిన మాలస్తంభనకర్మల సిద్ధింపజేయ గలదు. కాకి ఈకలచే గూర్చ బడినమాల విద్వేషకర్మ యందు ఫలకారి, ఉమ్మెత్త గింజలచే చేయబడిన మాల ఉచ్చాటన కర్మయందు శీఘ్రఫలకారి. గాడిద దంతములచే గూర్చబడిన మాలచే జపము చేయుట మారణ కర్మయందుపయోగించవలెను.

వశ్యాది కర్మలయందు మాలను సంబంధించుటకు బంగారపుతీగెగానీ, తెలుపురంగు దారముగానీ ఉపయోగించవలెను. ఆకర్షణము) స్తంభనము అను కర్మలయందు బంగారపు తీగెతో చేయబడిన మానవశరీరము నందలి సన్నని నరములతో, సంధించిన మాల మారణ కర్మలయందుపయోగించవలెను.

గుఱ్ఱపుతోక చివరగల వెంట్రుకలచే నేర్పడిన సూత్రముచే చేయబడిన మాల ఆకర్షణయందు, ఉచ్చాటనయందు శీఘ్ర ఫలప్రదము. శవము యొక్క వెంట్రుకలచే పేనబడిన సూత్రముగల మాలనుపయోగించుట మరణాభిచారకర్మలయందు చెప్పబడింది.

పగడములు, ముత్యములు, స్ఫటికములగల మాలతో జపము గావించిన యెడల కోటిరెట్లు అధికఫలమొసంగగలదు. తులసి పూసలు, మణులుగల మాలాజపము అక్షయ ప్రదమై తరగకుండును. అన్ని కార్యములందు నూట యెనిమిది పూసలు గల్గియున్న మాల చాలా శ్రేష్ఠమై యున్నది. శాంతికర్మలు, పుష్టికరమైన కర్మలు వశీకరణములయందు ఏబది నాల్గు పూసలుగల మాల ప్రశస్తము. ఆకర్షణకర్మయందు 27 పూసలు, స్తంభనమునందు 40 పూసలు, ద్వేషణము ఉచ్చాటన అను రెండు కర్మలయందు 25 పూసలు, మారణము మొదలగు దుష్ట, క్షుద్ర కర్మల యందు 15 పూసలు గల మాలయు ముఖ్యముగా నుపయోగించవలెను. 30 పూసలు మాలను ధనముగోరువారుపయో గించవలెను. 25 పూసల మాలతో జపము గావించిన సంతాన ప్రదులు కాగలరు. ఇరువది ఏదురుద్రాక్షలతో కూడిన మాలను కంఠమునందు ధరింపుచు నిత్యము దానితో దేవతాజపము గావింపుచుండిన ఆ జపము, కోటిరెట్లు అధికఫలిత మొసంగగలదు.

## జపము

బొటనవ్రేలు ఉంగరపు వ్రేలు (అనామిక) కలిపి మాలను గ్రహించి జపించుట వశ్యాది ఉత్తమకర్మలయందు నిర్ణయింపబడినది. బొటనవ్రేలు మధ్యవ్రేలు కలిపి మాల గ్రహించి జపించుట ఆకర్షణ కర్మలయందు శ్రేష్ఠము. బొటనవ్రేలు చూపుడువ్రేలు కలిపి జపించుట స్తంభన, ఉచ్చాటన కర్మల యందు యోగ్యము. బొటనవ్రేలు చిటికెనవ్రేలు కలిపి జపించుట అభిచారక కర్మలయందు సిద్ధప్రదము. బొటనవ్రేలు చూపుడువ్రేలు ఉంగరపువ్రేలు ఈ మూడింటినీ కలిపి మాలను గ్రహించి జపించుట విద్వేషణకర్మలయందు విధించబడినది.

మంత్రమునందలి అక్షరసంఖ్య ననుసరించి మంత్రములు మూడు విధములుగా చెప్పబడినది. 1.బీజమంత్రములు 2.పూర్ణమంత్రములు 3.మాలా మంత్రములు అను మూడు విధములైన మంత్రములు కలవు. బీజమంత్రములను గురించి: పది అక్షరముల వరకు గలట్టి మంత్రములు (పదివరకు అక్షరములుగలట్టి)బీజమంత్రములు. 10కి మించి ఇరువదినాలుగక్షరములకువరకు సంఖ్యగలట్టి మంత్రములు పూర్ణమంత్రములు. ఇరువదినాల్గునకు మించి అక్షరసంఖ్యగలట్టి మంత్రములన్నియు మాలా మంత్రములని దెలుపబడినవి. బాల్యమునందు (16సం॥వరకు) బీజమంత్రములు, యౌవనము నందు (30సం॥ వరకు) పూర్ణమంత్రములు, ప్రౌఢదశయందు(50సం॥వరకు) మూడు విధములైన మంత్రములు, వృద్ధాప్యములందు(50సం॥దాటిన పిమ్మట) మాలా మంత్రములు జపించుటవలన సత్వర ఫలసిద్ధి చేకూరగలదు. గురువు తనంతతాను బిలిచి యొసంగెడి మంత్ర మేదైనను యోగ్యప్రదమే కాగలదు. భాషయందలి ప్రతి అక్షరము శక్తివంతమగు ఒక బీజాక్షరముగా గుర్తించి ఆయా బీజాక్షరములకు గల గుణధర్మలమునుతెలిసికొనుట ఉత్తముడైన సాధకుని లక్షణము కాగలదు.

# మంత్రసాధనా నియమాలు

- ఈ పుస్తకంలో వివరించిన సాధనలు ఏ జాతి, ఏ వర్ణం, ఏ ఆశ్రమం, ఏలింగం వారైనా చేయవచును. స్వయంగా చేసుకోవచ్చు లేదా వేదం తెలిసిన ఏ బ్రాహ్మణునితోనైనా చేయించుకోవచ్చు.
- అలా చేసేవారు లేకపోతే మమ్మల్ని సంప్రదించండి.
- మహిళలు రజస్వల సమయంలో ఈ సాధన చేయకూడదు.
- సాధన మధ్యలో వారికి ఈ స్థితి కలిగితే ఐదురోజుల తరువాత తిరిగి సాధన ప్రారంభించాలి. ముందు సాధన చేసిన రోజులు కూడా లెక్కలోకి వస్తాయి.
- సాధనాసమయంలో సాధకులు ఒకే పూటసాత్వికాహారం భోజనం చేయాలి.
- ఉదయం,టీ,కాఫీలు త్రాగవచ్చు కానీ అభిషేయం అయినంత వరకూ ఏమీ తినకూడదు. అభిషేయం అయిన తరువాత అల్పాహారం లేదా భోజనం చేయవచ్చు జపము మధ్యలో ఏమీ తినకూడదు. తాగకూడదు.
- మాంసం, మద్యం మొదలైనవి వాడకూడు. సినిమాలు,టీవీలు చూడకూడదు. హోటళ్ళలో తినకూడదు.
- జప మంత్రాన్ని రోజంతా వీలైనంత ఎక్కువసంఖ్యలోజపం చేస్తూ ఉండాలి.
- సాధన సమయంలో స్త్రీ సంగమం పూర్తిగా నిషిద్ధం. మంచాలు, పరుపులూ వాడకూడదు.
- ఎక్కువ కాలం స్త్రీలతో సంభాషించడం (సాధకులు స్త్రీలయితే పురుషులతో, సినిమా పత్రికలు నవలలూ చదవకూడదు.
- స్నానం చేసి వీలైతే పట్టుబట్ట కట్టుకుని జపానికి కూర్చోవాలి.
- ఇంట్లో ఆ దేవతకు సంబంధించిన ఫోటో ఉంచాలి.
- జపానికి ముందు గణపతిని తప్పక అర్చించాలి. గణపతికి కొబ్బరికాయ, అరటిపండు శక్తిలేకపోతే నాలుగు ఎండుద్రాక్ష(కిస్మిస్‌పండ్లు)నైవేద్యంగా పెట్టాలి.
- జపము సమయంలో కత్తిరించి కుట్టిన బట్టలు తొడుక్కోకూడదు. (ప్యాంటు, బనీను,డ్రాయరు మొ॥)
- వివాహం కానివారు లుంగీలు, అయినవారుపంచెలు దరించిపైన ఉత్తరీయాన్ని కప్పుకుని జపము చేయాలి.
- జప సమయంలో వెంట్రుకలు తీయరాదు (షేవింగ్,కటింగ్ మొ॥)
- ధూమపానం, కిళ్ళీ,గుట్కాలు లాంటివి సేవించగూడదు.
- సెంట్లు, సుగంధద్రవ్యాలు వాడకూడదు. బయటకు వెళ్ళినప్పుడు చెప్పులు వేసుకొనవచ్చును.

- జప సమయంలో పనులు అన్నీ మానుకోవడం మంచిది. వీలుకాకపోతే ఉదయం ఆహారం తీసుకుని వ్యాపారం, ఉద్యోగాలకు వెళ్ళవచ్చును.
- మూత్రవిసర్జన చేస్తే కూర్చొని చేయడం, తరువాత కాళ్లుకడుక్కోవడం, పుక్కిలించి ఉమ్మేయడం చేయాలి. బైట ఏమీ తినకూడదు.
- జపము ఇంట్లోగాని, గుడిలోగానీ ఎక్కడైనా ప్రశాంత వాతావరణంలో చేయాలి.
- జపము చేసినన్ని రోజులూ శక్తి ఉంటే అఖండదీపం వెలిగించి ఉంచడం, కలశస్థాపన చేయడం  మంచిది.
- ప్రారబ్ధకర్మ బలంగా ఉంటే జపము అనేక విఘ్నాలు కలిగే అకాశం ఉంటుంది.
- జపము మధ్యలో ఎట్టి పరిస్థితిలోనూ లేవగూడదు. ఎవరితోనూ మాట్లాడకూడదు.
- జపముచేసే కాలంలో బూతులు మాట్లాడటం, అబద్ధాలు చెప్పడం, మోసము మాటలు చెప్పడం చేయకూడదు.
- జపముచేసి కాలంలో బూతులు మాట్లాడటం, అబద్ధాలు చెప్పడం, మోసపు మాటలు చెప్పడం చేయకూడదు.
- ఎల్లప్పుడూ శాంతంగా ఉండాలి. ఎలాంటి సందేహాలు మనసులోకి రానివ్వకూడదు. పూర్తినిష్ఠతో, తమ సద్గురువు అనుమతి పొంది సాధన ప్రారంభించాలి. ఈ నిష్ఠలన్నీ పాటిస్తూ సాధనాతత్పరులై సాధకులు సత్ఫలితాలు పొందాలని ఆశిస్తున్నాను.

# సర్వదేవతా బీజాక్షర మంత్ర ఫలములు

- "విద్యార్థికి వాగ్భవాది బీజమంత్రము
- ధనార్థికి శ్రీబీజ మంత్రము
- కామ్యపూర్తి సిద్ధికి మాయాబీజ మంత్రము
- ఆయుఃప్రాప్తికి నాలుగక్షరములతో కూడిన మహామృత్యుంజయ మంత్రమును జపించుట ఉత్తమము. ధీమంతుడగుసాధకుడు తక్కువగాఆహారమును భుజించాలి, మౌనముగానుండాలి. ఏకాగ్ర చిత్తముతో బీజాక్షర మంత్రమును మూడు లక్షలు జపించాలి. ఈ జపమునే వ్రతము పూర్తియగు వరకు తలచిన కార్యము పూర్తి అవదు.
- సాధకుడు సూర్యోదయకాలమున స్నానాధికార్యములను ముగించుకుని నిత్యము జపముగా బీజాక్షర మంత్రమును వేయిసార్లు చేయాలి. అట్లాచరించు సాధకునకు ఆయువు, స్వస్థత, వైభవము నిశ్చయముగా కలుగును.
- సాధకుడు మూడురోజులు ఉపవాసముండి నేయితో వేయి ఆహుతులతో హోమము చేసిన అంతకుముందు కంటే అధిక లాభము ప్రాప్తించును.
- సూర్యగ్రహ సమయమున సాధకుడు పలాశ(మోదుగ) సమిధలు, నేయితో హోమముచేసిన వేయిరెట్లు లాభము కలగును.
- చంద్రగ్రహణ సమయమున ఎర్ర చందనము, నెయ్యితో హోమము చేసిన వేయిరెట్లు బంగారము లభించును.
- ఆవుపేడతో చేసినపిడకలతో అగ్నిని ప్రజ్వలింపచేసిన రక్తచందన సమిధలతో హోమము చేసిన సాధకునకు వేయి గోవులు లభించును.
- జాజి,చంపక(సంపెంగ) శ్వేతార్క(తెల్లజిల్లేడు) పుష్పములను నేయిలోముంచి హోమము చేసిన వస్త్రలాభము కలుగును)
- సూర్యునికి జలముతో వేయిరెట్లు అర్ఘ్యము ఇచ్చుసాధకునకు బంగారము లభించును. ఇదే విధముగా చంద్రునకు వేయిసార్లు అర్ఘ్యమునిచ్చిన సాధకునకు వెండి లభించును.
- దరిద్రుడు, పాపియగువాడు ఔషధీయుక్త జలమునందు స్నానము చేసి నిత్యము రోజుకు వేయిసార్లు బీజాక్షర మంత్రమును జపించిన అతని పాపములు నశించును.
- ఆవునేయిలో ముంచిన లోధ్ర సమిధలతో వేయి ఆహుతులను సమర్పించినవానికి చోర,అగ్ని,వాయు మొదలగు భయములుండవు (లోధ్ర=అర్జునవృక్షము, ఇది చూచుటకు అశోక చెట్టువలె ఉంటుంది)

- పాలు మాత్రమే ఆహారముగా తీసుకుంటూ లక్షజపముచేయు సాధకుడు మృత్యువును జయించును.
- నేయితో కూడిన వేతసీవృక్షపత్రములతో హోమము చేయుసాధకుడు లక్షాధికారి అవుతాడు. ఇందుకు సందేహములేదు.
- ఈ విధంగా యే మనుష్యుడు పవిత్ర జలములో బొడ్డువరకూ జలముండునట్లు సూర్యనకభిముఖముగా నిలబడి విభూతితో లక్షసార్లు జపిస్తాడో (అట్లు నీటిలోనిలబడి బీజాక్షర మంత్రమునొకసారి పఠించి కొంచెము విభూతిని ఆ నీటవేయాలి. అలా లక్షసార్లు చేయాలని పై వాక్యమునకు భావము) అతని భార్యకు గర్భస్రావములు(ఎబార్షన్స్) తెల్లబట్ట, ఎర్రబట్ట అనుప్రదరవ్యాధులు, చనిపోయిన బిడ్డలకు కనుట అనుదోషములు నశించును.
- నేయితో తడిసిన నువ్వులతో హోమము చేయు సాధకుని మనోభీష్టములు నెరవేరును. అతడు సమర్థుడై ఉత్తమపదవిని పొందును.
- వేయిసార్లు నేయితో హోమము చేస్తే మనోరథము(మనసులోని కోరిక) నెరవేరి పరమసిద్ధి లభించును.
- నేయితో లక్షసార్లు హోమము చేసిన వ్యక్తికి అన్ని కోరికలు సిద్ధించును.
- ఏ మనుష్యుడు పంగవ్యములు (ఆవునెయ్యి, ఆవుపేడ,గోమూత్రం, ఆవుపాలు,ఆవుపాలతోనయిన పెరుగు పంగవ్యములనబడును) సేవించుచు లక్షసార్లు బీజాక్షర మంత్రమును జపించునో అతనికి పూర్వజన్మస్మృతికలగును.
- ఆ పంగవ్యములతో హోమము చేయు వ్యక్తికి అన్నియు సాధింపబడును.
- అన్నముతో నిత్యము హోమము చేయు వ్యక్తికి ఆహారమునకు కావలసిన అన్ని పదార్థములు లభించును. ఈ విధంగా తాను కోరిన వాటిని పొందుటకు పదివేల సంఖ్యలో ఆహుతుల నర్పించుచు హోమము చేయాలి.
- ఏ మనుష్యుడు ఏదేవత నిమిత్తమై ఎర్ర ఆవాలతో వెయ్యి హోమాహుతులను సమర్పిస్తాడో అతడు శత్రుంజయుడవుతాడు. (అతడు శత్రువులను జయించగలుగుతాడు.
- తేనె, ఉప్పులతో హోమము చేయువానికి సర్వ వశీకరణము లభిస్తుంది.
- ఎర్రగన్నేరు పూలతో హోమము చేయువానికి నీటిలో అగ్నిని పుట్టించు శక్తి కలుగుతుంది.
- భల్లాతకవిత్తుల నూనెతో హోమము చేయువానికి దేశమంతా లొంగి ఉంటుంది.
- వేప ఆకులతో హోమము చేయువ్యక్తికి శాంతి లభిస్తుంది.
- ఏ వ్యక్తి బ్రహ్మచర్యమును పాటిస్తూ స్వల్పముగా భుజిస్తూ నిత్యమూ బీజాక్షర మంత్రమును మూడువేలసార్లు జపిస్తూ ఉంటాడో ఆ వ్యక్తి ఒక

సంవత్సములోపుననే ధనసంపద వైభములు కలుగుతాయి. ఇందులో సందేహము లేదు.

- శమీ,బిల్వ,పలాశ,అర్క(జిల్లేడు) పుష్పములతోను, సమిధలతోను హోమము చేయువానికి బంగారము లభిస్తుంది.
- నిరాహారియై బ్రమ్మలేక శివాలయమునందు బీజాక్షర మంత్రము లక్ష జపించిన వానికి ఆ దేవత కృప లభిస్తుంది.
- బిళ్వ పత్రములను నేయిలో ముంచి లక్షహోమము చేస్తే లక్ష్మీకృపలభిస్తుంది. భ్రూణహత్యాదోషము నివారింపబడుతుంది.
- పద్మము(తామరపూవు)లతో నేయితో హోమము చేయువానికి సుసంపన్నమైన రాజ్యము (పదవి/ఉద్యోగము) లభిస్తుంది.
- ఆవుపాలు,పెరుగులతో 25 లక్షలు హోమము చేయువానికి ఆత్మ సాక్షాత్కారము లభిస్తుంది.
- ఒకరోజు పంగవ్యములను, ఒకరోజు వాయువును ఆహారముగా తీసుకుని ఒక లక్షజపించిన వానికి రోగములన్నియు తొలగిపోవును.
- బీజాక్షర మంత్రముతో వందసార్లు లభిమంత్రించిన జలముతో స్నానముచేసినా, వందసార్లు మంత్రించిన జలమును త్రాగినా, వందసార్లు జపము చేసినా సర్వపాపములు తొలగిపోవును.
- శ్వేత చందనము (మంచిగంధము)రక్త (ఎర్రని) చందనము, కర్పూరము, బియ్యము,యవలు,లవంగములు,జాజికాయలు,మామిడిపుల్లలు,చక్కెర,అన్నములతో హోమము చేయువానికి గోహత్య, పితీహత్య,మాతృహత్య,గురుహత్య, గురపత్నీ సమాగమము, (గురుతల్పగామి) మద్యపానము, బంగారము, తైలములను దొంగిలించుట మొదలగువాని వలన కలుగు పాపములు తొలగిపోయి దైవసాన్నిధ్యము లభించును. లోకమున గ్రహములు సూర్యచంద్రులున్నంత వరకు శివసాన్నిధ్యము (మోక్షము) కలుగును. ఇందు సంశయములేదు.
- అన్నము,నేయి, ఇతర ఆహార పదార్థములతో హోమము చేయువానికి నిందిత కర్మలు చేసిన పాపము తొలగిపోయి సుఖము లభించును. ప్రతికూలించిన నవగ్రహములు శాంతించును.

# మంత్ర జప ఫలములు

- ఆర్థికంగా ఉన్నతి ప్రాప్తిస్తుంది.
- దారిద్ర్యం నశించిపోయి, నూతన లాభాలు అనుభవంలోకి వస్తాయి.
- ధనప్రాప్తికి ఆటంకాలుగా ఉన్న బాధలు దూరమైపోతాయి.
- నిరుద్యోగులకు ఉద్యోగం లభించే అవకాశం ఏర్పడుతుంది.
- కోరుకున్న ఉద్యోగం లభిస్తుంది, నిష్క్రియత సమాప్తమై పోతుంది.
- ఉద్యోగంలో బాధలు వస్తూ ఉంటే, అనుకూలత లేకపోతే బాధలు తొలగిపోయి అనుకూలత ఏర్పడుతుంది.
- ఉద్యోగంలో (శాస్త్రాలో ఉద్యోగానికి 'సంయోజన' శబ్దాన్ని వాడారు) ప్రమోషన్,ఔన్నత్యం రాకుంటే అవి లాభిస్తాయి.
- ఉద్యోగంలో అధికారుల వల్ల బాధలు వస్తున్నా, అభిప్రాయ భేదాలు ఏర్పడినా, మానసిక క్లేశాలు వచ్చినా అవి తొలగిపోతాయి.
- మనస్సులో ఏదైనా వ్యాపారం ప్రారంబించాలని ఉంటే ఆ అవకాశం ఏర్పడుతుంది.
- వ్యాపారం ప్రారంభమై బాధలు దూరమైపోతాయి.
- వ్యాపారంలో అనుకూలత లేకుంటే అనుకూలత లభిస్తుంది.
- వ్యాపారంలో సఫలత సాధ్యమవుతుంది.
- మనసుకి నచ్చిన కోరిన వ్యాపారం లేకుంటే మనో వాంఛితమైన వ్యాపారం లభిస్తుంది.
- దారిద్ర్యంలో కొట్టుకులాడుతుంటే ఆ దారిద్ర్యం నిర్మూలమైపోతుంది.
- వ్యాపారంలో ప్రభుత్వ సంబంధమైన (ఆదాయపు పన్ను,అమ్మకపుపన్ను,మొదలైన) బాధలు, ఇబ్బందులు వస్తే అవి దూరమైపోతాయి
- బజారులో వ్యాపార ప్రతిష్ఠ తగ్గిపోతుంటే మళ్ళీ ప్రతిష్ఠ కలుగుతుంది.
- వ్యాపారంలో శ్రేష్ఠత్వం, పూర్ణత్వం ఏర్పడతాయి.
- కొత్త వ్యాపారాలు ప్రారంభమవుతాయి. అన్నిరకాల వ్యాపారాలలో సాఫల్యం లభిస్తుంది.
- భాగస్వాములతో అభిప్రాయ భేదాలు వస్తే అభిప్రాయ భేదాలు తొలగిపోతాయి లేదా భాగస్వాములు వదలిపోతారు.
- వ్యాపారంలో ప్రతిష్ఠ,సన్మానం,కీర్తి,శ్రేష్ఠత్వం లభిస్తాయి.
- మీరు ఏ పని చేస్తున్నా అడ్వకేట్ కావచ్చు, పూజారులు కావుచ్చు, ధార్మిక కార్యక్రమాలుచేసేవారు కావచ్చు, రచయితలుకావచ్చు ఆ పనులలో సాఫల్యం లభిస్తుంది, కోరుకున్న పరిపూర్ణత్వం లభిస్తుంది.

- ఏ పనులలోనైనా ఎలాంటి బాధలూరావు, సాఫల్యం లభిస్తుంది.
- ఆర్థిక లోపం సమాప్తం అయిపోయి ఇంటిలో ధనం పోగుపడటం మొదలవు తుంది.
- మనస్సు ప్రసన్నంగా ఉంటుంది. చింతలు తొలగిపోతాయి, ఆర్థిక సమస్యలు ఉండవు.
- సమాజంలో కీర్తి,సన్మానం లభిస్తాయి.
- దివాలా తీసే పరిస్థితి వచ్చినా అది దూరమైపోయి, సమాజంలో గౌరవం లభిస్తుంది.
- పూర్ణ పురుషత్వం ప్రాప్తిస్తుంది. సంతానం తప్పుదు మార్గం పట్టినా, సహాయకంగా లేకపోయినా వారు అనుకూలంగా మారిపోతారు.
- భార్యాభర్తల మధ్య అభిప్రాయభేదాలు సమసిపోయి గృహస్థ జీవనం అనుకూలంగా మారుతుంది.
- ఇంటిలో పరిపూర్ణ సుఖశాంతులు, ఆనందమయ వాతావరణం ఏర్పడుతుంది
- ధార్మిక సామాజిక కార్యాలు నిర్వర్తించవచ్చు. జీవితంలో ఎలాంటి లోటూ ఉండదు.
- జీవితంలో ఎన్నిభోగాలు ఉంటాయో అవన్నీ లభిస్తాయి. విదేశయాత్రలు, ధార్మిక కార్యాలు, సంతానప్రాప్తి, సంతాన సుఖం మొదలైనవన్నీ సమకూరుతాయి.
- జీవితంలో ఎన్ని సమస్యలుంటాయో అన్నీ తొలగిపోతాయి.
- పైన చెప్పినవి కాక జీవితంలో మరి ఎలాంటి సమస్యలున్నా అవి తొలగిపోయి పరిపూర్ణ సుఖసంతోషాలు, గౌరవం, కీర్తి,వైభవం,లభిస్తాయి. జీవితంలో పరిపూర్ణభోగాల్లు అనుభవిస్తూ ధార్మిక కార్యాలు చేయడం వల్ల చివరికి మోక్ష కూడా లభిస్తుంది.
- అయితే పరిపూర్ణ విధి విధానంతో ఈ జపము చేయటం (యోగ్యులైన బ్రాహ్మణులు లేదా పండితులు చేత చేయించటం) అవసరం. సాధనలో ఏ ఆటంకం ఏర్పడినా, మంత్రోచ్చారణలో పొరపాటు జరిగినా దానికి సంబంధి విపరీత ప్రభావ పరిణామాలు ఏవీ ఉండవు. ఇది సౌమ్య సాధన కావటమే దానికి కారణం. ఇలాంటి సాధనలో అపరిపూర్ణత వచ్చినా విపరీత పరిణామా సంభవించవు. అయితే ప్రయోజనంకొద్దిగానే ఉంటుంది.

# గణపతి మంత్రములు



# గణపతి మంత్రములు

## 1. గణపతి అష్టాక్షర మంత్రము

**"ఓం గం గణపతయే నమః"**

**ప్రయోజనము :** కుటుంబ కలహములు, భార్య భర్తల మధ్య ఉండే తగవులు, వ్యాపార నష్టము, కోర్టు వ్యవహారములు, ఋణబాధలు, ప్రభుత్వ సంబంధమైన చిక్కులు, దీర్ఘవ్యాధులచే బాధింపబడుట – మొదలుగాగల కష్టనష్టములనుండి విముక్తి పొందవచ్చును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 11,664 (108×108) ప్రతిరోజు – 40 రోజులు
2. 1లక్ష 25 వేలు
3. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 2. శ్రీ లక్ష్మీగణపతి మంత్రము

**"ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వర వరద సర్వజనం మే వశమానయ స్వాహా"**

**ప్రయోజనము :** సకల విఘ్నములు తొలగి అన్ని కోరికలు నెరవేరును. ఐశ్వర్య సుఖభోగములు, సర్వజన ప్రియత్వము, సర్వోపద్రవ నివృత్తి, ఆరోగ్యం, శత్రువిజయము, గౌరవము కల్గును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య : 4 లక్షల 25వేలు 40 రోజులలో చెయ్యవలెను.

## 3. శ్రీ మహాగణపతి మాలామంత్రము

**"ఓం నమో భగవతే గ్లౌం మహాగణపతయే సింధూర రంజితాయ పుండ్రేక్షు గదా శూల పరశు పాశాంకుశ ధరాయ ఓం శ్రీం హ్రీం క్లీం సర్వజన సంరక్షకాయ సర్వలక్ష్మీ**

ప్రదాయ సర్వలోకవశీకరణాయ క్రోం క్రోం క్రోం అరి అరి అరి క్లీం క్లీం క్లీం పాశాం కుశాభ్యాం సకల రాజ మండలం మమ వశమానయ వశమానయ క్లీం క్లీం క్లీం సకల విషాది నివారణం కురు కురు రం రం రం ప్రోం ప్రీం ప్రూం క్షం సకల భూత ప్రేత పిశాచ బ్రహ్మరాక్షస యక్షిణీ మోహినీ శూలినీ చతుష్షష్టియోగిన్యాది సకల బేతాళ గ్రహశాకినీ డాకినీ విధ్వంసనం కురు ఫ్రోం ఫ్రోం ఫ్రోం సకల చోరభయాన్ నివారయ నివారయ ఠం ఠం ఠం శత్రు మండలం స్తంభయ స్తంభయ గ్లౌం గ్లౌం గ్లౌం సకల విఘ్నాన్ విధ్వంసయ విధ్వంసయ సౌం శ్రీం మమ మనోరథం సాధయ సాధయ ఓం శ్రీం హ్రీం క్లీం శ్రీ మహాగణపతయే హుం ఫట్ స్వాహా "

**ప్రయోజనము :** ఈ మంత్రమును ముందుగా గ్రహణ సమయములో 1008సార్లు జపించి సిద్ధింపజేసుకొనవలెను. ఈ మంత్రసాధన వల్ల సకల గ్రహ, బ్రహ్మ రాక్షస భూత ప్రేత భయములు నివారించబడును. సకల కష్టనష్టములు, వ్యాపారపుచిక్కులు, కోర్టుచిక్కులు తొలగును. సకల మనోవాంఛలు నెరవేరును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య : ప్రతిరోజు 108 సార్లు. ఈవిధముగా 40 రోజులు లేదా కార్యసిద్ధి అగువరకు.

## 4. హరిద్రా గణపతి మంత్రము

**"గ్లం" (ఏకాక్షర మంత్రము)**

**ప్రయోజనము :** గణపతిమంత్రములు అన్నియునూ స్నానము చేసి శుచియై జపించవలెను. ఎవరు ఏ కోరికతో జపించెదరో వారికి ఆయా కోరికలు శీఘ్రముగా ఫలించును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య : 4 లక్షల 25వేలు 40 రోజులలో చెయ్యవలెను.

## 5. హేరంబ గణపతి మంత్రము

**"ఓం గూం నమః "**

**ప్రయోజనము :** మనస్సులోని కోరిక జపసంఖ్య పూర్తి అగుసరికి ఫలించును. స్వయంగా విష్ణుమూర్తి ఈ మంత్రమును దేవతలకు ఉపదేశించెను.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య : 6 లక్షలు 40 రోజులలో చెయ్యవలెను.

## 6. హేరంబ గణపతి మంత్రము

**"ఇది క్షిప్రగణపతి మంత్రం"**

**ప్రయోజనము :** మనస్సులోని కోరిక జపసంఖ్య పూర్తి అగుసరికి ఫలించును. స్వయంగా విష్ణుమూర్తి ఈ మంత్రమును దేవతలకు ఉపదేశించెను.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య : 6 లక్షలు 40 రోజులలో చెయ్యవలెను.

## 7. హేరంబ గణపతి మంత్రము

"ఓం గూం హేరంబాయనమః"

ప్రయోజనము : మనస్సులోని కోరిక జపసంఖ్య పూర్తి అగుసరికి ఫలించును. స్వయంగా విష్ణుమూర్తి ఈ మంత్రమును దేవతలకు ఉపదేశించెను.

మంత్రసిద్ధి : జపసంఖ్య : 6 లక్షలు 40 రోజులలో చెయ్యవలెను.

## 8. మహాగణపతి మంత్రము

"ఓం హ్రీం గం హ్రీం మహాగణపతయే స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రజపము చేయుటవల్ల సాధకునకు సమస్తమైన కోరికలు గణపతి అనుగ్రహమువల్ల నెరవేరి సమస్తమైన సుఖభోగములను అనుభవించుదురు.

మంత్రసిద్ధి : జపసంఖ్య : 1 లక్ష 25వేలు 40 రోజులలో చెయ్యవలెను.

## 9. మహాగణపతి మంత్రము

" ఓం హ్రీం గం హ్రీం వశమానయ స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రజపము చేయుటవల్ల సాధకునకు సమస్తమైన కోరికలు గణపతి అనుగ్రహమువల్ల నెరవేరి సమస్తమైన సుఖభోగములను అనుభవించుదురు.

మంత్రసిద్ధి : జపసంఖ్య : 1 లక్ష 25వేలు 40 రోజులలో చెయ్యవలెను.

## 10. గణపతి షడక్షరీ మంత్రము

"వక్రతుండాయ హుం"

ప్రయోజనము : సాధకునకు తా నొనర్చెడి ఉద్యోగ, వృత్తి, వ్యాపారములందు వచ్చు విఘ్నములు ఈ మంత్రసాధనవల్లతొలగి గణపతి అనుగ్రహమువల్ల కార్యసాఫల్యత శీఘ్రంగా కల్గును.

బ్రహ్మదేవుడు, కార్తికేయుడు ఈ మంత్రమును జపించిరి.

మంత్రసిద్ధి : జపసంఖ్య : 1. 6లక్షలు 40 రోజులలో చెయ్యవలెను.

2. 1 లక్ష 25 వేలు

## 11. బుద్ధి సిద్ధి గణేశ మంత్రము

"ఓం హ్రీం క్లీం బ్లూం వీరవర గణపతే షః వః

ఇదం విశ్వం మమ వశమానయ ఓం హ్రీం ఫట్ స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రసాధన వల్ల గణపతి అనుగ్రహముతో బుద్ధి సిద్ధి కలుగును. సకల మనోవాంఛలు నెరవేరును.

మం(త్రసిద్ధి : జపసంఖ్య. 1. 1లక్ష 25వేలు
2. ప్రతిరోజు 1008 సార్లు 40 రోజులు

ప్రతిరోజు మంత్రసాధనకు ముందు గణపతిని పూజించి పంచామృత స్నానము చేయించి నైవైద్యము పెట్టవలెను. జపానంతరం హోమము చెయ్యవలెను.

## 12. గణపతి ద్వాత్రింశదక్షర మాలామంత్రము

**"ఓం శ్రీం హ్రీం క్లీం గణేశ్వరాయ బ్రహ్మస్వరూపాయ గురువే సర్వసిద్ధి ప్రదాయ విఘ్నేశాయ నమోనమః "**

**ప్రయోజనము :** మహాసిద్ధత్వము, గురుత్వము, వాక్పతిత్వములను ఈ మంత్రముతో పొందవచ్చును. సమస్త విఘ్నములు తొలగి సమస్త కోరికలు నెరవేరును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 5లక్షలు 40 రోజులలో పూర్తిచేయవలెను.

## 13. గణపతి ద్వాత్రింశదక్షర మాలామంత్రము

**" ఓం శ్రీం హ్రీం క్లీం గణేశ్వరాయ బ్రహ్మ రూపాయ చారవే సర్వసిద్ధి ప్రదాయ విఘ్నేశాయ నమోనమః "**

**ప్రయోజనము :** మహాసిద్ధత్వము, గురుత్వము, వాక్పతిత్వములను ఈ మంత్రముతో పొందవచ్చును. సమస్త విఘ్నములు తొలగి సమస్త కోరికలు నెరవేరును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 5లక్షలు 40 రోజులలో పూర్తిచేయవలెను.

## 14. ఉచ్ఛిష్ట గణపతి మంత్రము

**"ఓం గం హస్తి పిశాచిలిఖే స్వాహా"**

**ప్రయోజనము :** ఈ మంత్రమును జపించుటకు ముందుగా ఉచ్ఛిష్ట గణపతిని పూజించి ఆ గణపతికి నైవైద్యము పెట్టిన పదార్థమును భుజించి ఉచ్ఛిష్ట ముఖముతో జప మొనరించవలయును.

1. వివాహము కావలసిన సాధకుడు 5వేలు జపము చేసినచో సిద్ధిపొందిన తర్వాత అనుకూలమైన భార్య లభించును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1 లక్ష జపము చేసి, 10 వేలు తిలలతో హోమ, తర్పణ మొనరింపవలయును.

## 15. ఉచ్ఛిష్ట గణపతి మంత్రము

**"ఓం నమః ఉచ్ఛిష్ట గణేశయ హస్తి పిశాచిలిఖే స్వాహా"**

**ప్రయోజనము :** ఈ మంత్రమును జపించుటకు ముందుగా ఉచ్ఛిష్ట గణపతిని పూజించి ఆ గణపతికి నైవైద్యము పెట్టిన పదార్థమును భుజించి ఉచ్ఛిష్ట ముఖముత జప మొనరించవలయును.

సాధకుడు సిద్ధిపొందిన తరువాత ఎవరి పేరును తలుచుకుని ఈ మంత్రమును ఒక వెయ్యిజపము చేసెదరో ఆవ్యక్తి వశమగును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1 లక్ష జపము చేసి, 10 వేలు తిలలతో హోమ, తర్పణ మొనరింపవలయును.

## 16. ఉచ్ఛిష్ట గణపతి మంత్రము

**"ఓం హస్తి పిశాచిలిఖే స్వాహా"**

**ప్రయోజనము :** ఈ మంత్రమును జపించుటకు ముందుగా ఉచ్ఛిష్ట గణపతిని పూజించి ఆ గణపతికి నైవైద్యము పెట్టిన పదార్థమును భుజించి ఉచ్ఛిష్ట ముఖముతో జప మొనరించవలయును.

విఘ్నములు, శత్రు,యుద్ధభయము, కోర్టు వగైరా వ్యవహారములు, అగ్నిప్రమాదము, విషజంతు భయములు సంభవించినప్పుడు ఈ మంత్రజపము వల్ల అన్నివిధముల క్షేమము కలుగును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1 లక్ష జపము చేసి, 10 వేలు తిలలతో హోమ, తర్పణ మొనరింపవలయును.

## 17. ఉచ్ఛిష్ట గణపతి మంత్రము

**"ఓం హస్తిముఖాయ లంబోదరాయ ఉచ్ఛిష్ట మహాత్మనే ఆం క్రోం హ్రీం క్లీం హ్రీం హ్రూం ఘే ఘే ఉచ్ఛిష్టాయ స్వాహా"**

**ప్రయోజనము :** ఈ మంత్రమును జపించుటకు ముందుగా ఉచ్ఛిష్ట గణపతిని పూజించి ఆ గణపతికి నైవైద్యము పెట్టిన పదార్థమును భుజించి ఉచ్ఛిష్ట ముఖముతో జప మొనరించవలయును.

సర్వజన వశీకరణమునకు సాధకుడు తన బొటనవ్రేలి ప్రమాణముతో రక్తచందన లేక తెల్లజిల్లేడువేరుతో గణేశ ప్రతిమను చేయించి దానికి ప్రాణప్రతిష్ఠ పూజ, విధిపూర్వకముగా బెల్లపు పరమాన్నమును నైవేదన చేసి, తిని, ఎంగిలినోటితో ప్రతినిత్యము 1008 జపముసల్పి, నేతిలో తిలలు తడిపి 108 సార్లు హోమము, చేసిన సర్వజనవశీకరణమై కోరిన కోరికలు సిద్ధించును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1 లక్ష జపము చేసి, 10 వేలు తిలలతో హోమ, తర్పణ మొనరింపవలయును.

## 18. ఉచ్ఛిష్ట గణపతి మంత్రము

**"ఓం గం హుం గ్లాం గ్లాం ఉచ్ఛిష్ట గణేశాయ మహాయక్షాయ అయం బలిః"**

**ప్రయోజనము :** ఈ మంత్రమును జపించుటకు ముందుగా ఉచ్ఛిష్ట గణపతిని పూజించి ఆ గణపతికి నైవేద్యము పెట్టిన పదార్థమును భుజించి ఉచ్ఛిష్ట ముఖముతో జప మొనరించవలయును.

ఈమంత్రమును కాగితము మీద వ్రాసి సిద్ధిపొందిన మంత్ర జపమును ధారపోసి ఆ కాగితమును తావీజులో పెట్టి మెడలో ధరించినచో సాధకునికి రక్షణము, సౌభాగ్యవృద్ధియు కల్గును.

**మంత్రసిద్ధి, జపసంఖ్య:** లక్ష జపము చేసి, 10 వేలు తిలలతో హోమ, తర్పణ మొనరింపవలయును.

## 19. ఉచ్ఛిష్ట గణపతి మంత్రము

**" ఓం నమో భగవతే ఏకదంష్ట్రాయ హస్తిముఖాయ లంబోదరాయ ఉచ్ఛిష్ట మహాత్మనే ఆం క్రోం హ్రీం గం ఘే ఘే స్వాహా"**

**ప్రయోజనము :** ఈ మంత్రమును జపించుటకు ముందుగా ఉచ్ఛిష్ట గణపతిని పూజించి ఆ గణపతికి నైవేద్యము పెట్టిన పదార్థమును భుజించి ఉచ్ఛిష్ట ముఖముతో జప మొనరించవలయును.

వివాహము కావలసిన సాధకుడు 5వేలు జపము చేసినచో సిద్ధిపొందిన తర్వాత అనుకూలమైన భార్య లభించును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1 లక్ష జపము చేసి, 10 వేలు తిలలతో హోమ, తర్పణ మొనరింపవలయును.

## 20. ఉచ్ఛిష్ట గణపతి మంత్రము

**" ఓం హస్తి పిశాచిలిఖే ఠః ఠః"**

**ప్రయోజనము :** ఈ మంత్రమును జపించుటకు ముందుగా ఉచ్ఛిష్ట గణపతిని పూజించి ఆ గణపతికి నైవేద్యము పెట్టిన పదార్థమును భుజించి ఉచ్ఛిష్ట ముఖముతో జప మొనరించవలయును.

సాధకుడు సిద్ధిపొందిన తరువాత ఎవరి పేరును తలుచుకుని ఈ మంత్రమును ఒక వెయ్యిజపము చేసెదరో ఆవ్యక్తి వశమగును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1 లక్ష జపము చేసి, 10 వేలు తిలలతో హోమ, తర్పణ మొనరింపవలయును.

## 21. విఘ్నములు తొలగు గణపతి షోడశాక్షర మంత్రము

"ఓం గం గ్లాం గణపతయే విఘ్న వినాశినే స్వాహా"

ప్రయోజనము : ప్రారబ్ధ వశమునగాని, మరియు సర్వ విఘ్నములను నివారించి కోరిన కోరికలను సిద్ధింపజేయు ఈమంత్రమును రాధ జపించి శ్రీకృష్ణుని పొందినది. భర్త వలన వియోగముపొందినవారు, పెళ్ళికావలసిన స్త్రీలు మంచి భర్తను పొందవచ్చును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 1లక్ష 25వేలు

2. ప్రతిరోజు 1008 40 రోజులు.

## 22. సిద్ధి గణపతి మంత్రము ( ప్రయాణములో పఠించవలసినది)

**"ఓం నమో సిద్ధి వినాయక సర్వకార్యకర్త్రే సర్వవిఘ్నప్రశమనాయ సర్వరాజవశ్య కరణాయ సర్వజన స్త్రీపురుషాకర్షణాయ శ్రీం ఓం స్వాహా"**

ప్రయోజనము : ఈ మంత్రము సాధకుడు ప్రతిరోజు 108 సార్లు జపించుచున్నచో అవిఘ్నముగా అన్ని పనులు జరుగును. ప్రయాణకాలములో ఈ మంత్రమును 108 సార్లు జపించి వెళ్ళిన, పనిసానుకూలమగును.

మంత్రసిద్ధి: 1లక్ష 25 వేలు

## 23. గణేశ మాతృకాన్యాస మంత్రము

"గాం గీం గూం గైం గౌం గః"

ప్రయోజనము : విద్యార్థులకు విద్యలో ప్రావీణ్యత, జనాకర్షణ, సంపదలు, కీర్తి కవిత్వ శక్తి లభించును. ఇష్టసిద్ధి, ఐశ్వర్యము కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 6 లక్షలు

2. 1 లక్ష 25వేలు

## 24. ఏకాక్షర గణపతి మంత్రము

"ఓం గం ఓం"

ప్రయోజనము : ఈ మంత్ర సాధన వల్ల సాధకుడు గణపతి అనుగ్రహమును పొంది మనోభీష్టసిద్ధి కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 10 లక్షలు

2. ప్రతిరోజు 2500 40 రోజులు

3. ప్రతిరోజు 108 సారు కార్య సిద్ధికొరకు జీవితాంతం

## 25. రత్నగర్భ గణేశ మంత్రము

**"ఓం క్ల్యాం ఊం గ్లీం గల నవశ్రీ తామణయే రత్నగర్భాయ మహాగణేశాయ స్వాహా"**

**ప్రయోజనము :** ఈ మంత్ర సాధన వల్ల సకల మనోవాంఛలు శీఘ్రంగా నెరవేరుతాయి.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 3లక్షలు

## 26. మహాగణపతి మంత్రము

**"ఓం శ్రీం హ్రీం క్లీం ఐం సౌం గ్లౌం శ్రీం హ్రీం దూం క్లీం గ్లౌం గౌం గం గః మహాగణాధిపతయే నమః"**

**ప్రయోజనము :** ఈ మంత్ర సాధన వల్ల సకల మనోవాంఛలు నెరవేరును. సకల కార్య అనుకూలతలు కల్గును. ఇహములో సుఖ భోగములను పొంది అంత్యమున మోక్షమును పొందవచ్చును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 2 లక్షల 60 వేలు

2. ప్రతిరోజు 1008 40 రోజులు లేక కార్యసిద్ధి అగు వరకు

3. ప్రతిరోజు 108 జీవితాంతం.

## 27. ఏకాక్షర గణపతి మంత్రములు

**1. "ఓం గ్లౌం నమః"**

**2. "ఓం గం స్వాహా"**

**3. "ఓం గం నమః"**

**ప్రయోజనము :** ఈ మంత్ర సాధన వల్ల సాధకునికి పరలోకములో మోక్షము ఇహ లోకంలో సంపదలు కల్గి మనోవాంఛలు నెరవేరును.

దిక్పాలురు వశములగుదురు.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 10 లక్షలు

2. 4 లక్షలు

3. ప్రతిరోజు 1008 40 రోజులు (లేక) కార్యసిద్ధి అగు వరకు

## 28. విఘ్నగణపతి మంత్రము

**"ఓం గం గణపతయే సర్వ విఘ్నహరాయ సర్వాయ సర్వ గురవే లంబోదరాయ హ్రీం గం నమః"**

ప్రయోజనము : ఈ మంత్ర సాధన వల్ల సర్వ వ్యవహార చిక్కులు తొలగును. సకల వాంఛాఫల సిద్ధి కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 3 లక్షల 10 వేలు

2. ప్రతిరోజు 1008 కార్యసిద్ధి అగు వరకు

## 29. గణేశ మంత్రము

"ఓం గం గణేశాయ నమః"

ప్రయోజనము : ఈ మంత్ర సాధన వల్ల సకల సిద్ధులు కలుగును. సంతానార్థులకు సంతానము, విద్యార్థులకు విద్యాభివృద్ధి, వ్యాపారస్థులకు వ్యాపారాభివృద్ధి కలుగును. సాధనా తీవ్రత ననుసరించి గణేశుని శ్రీ సిద్ధి గణేశుని దర్శన బాగ్యము కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 8 లక్షలు

2. ప్రతిరోజు 1008 కార్యసిద్ధి అగు వరకు

3. ప్రతిరోజు 108 జీవితాంతము.

## 30. గణేశ మంత్రము

"ఓం గణేశాయ నమః"

ప్రయోజనము : ఈ మంత్ర సాధన వల్ల సకల సిద్ధులు కలుగును. సంతానార్థులకు సంతానము, విద్యార్థులకు విద్యాభివృద్ధి, వ్యాపారస్థులకు వ్యాపారాభివృద్ధి కలుగును. సాధనా తీవ్రత ననుసరించి గణేశుని శ్రీ సిద్ధి గణేశుని దర్శన బాగ్యము కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 8 లక్షలు

2. ప్రతిరోజు 1008 కార్యసిద్ధి అగు వరకు

3. ప్రతిరోజు 108 జీవితాంతము.

## 31. శ్రీ విద్యాగణపతి మంత్రము

"ఓం శ్రీం హ్రీం క్లీం గ్లాం గం క ఏ ఈ ల హ్రీం గణపతయే హ స క ల హ్రీం వర వరద సకల హ్రీం సర్వజనం మే వశమానయస్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రసాధన వల్ల శ్రీ, విద్యా, గణపతుల అనుగ్రహం శీఘ్రముగా పొంది సకల మనోవాంఛలు నెరవేరును. సకల సిద్ధులను సిద్ధింపజేయును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 4 లక్షల 20 వేలు

2. ప్రతిరోజు 1008 కార్యసిద్ధి అగువరకు.

## 32. చింతామణి గణపతి మంత్రము

"ఓం క్ష్మ్ర్యూంగ్లౌం గం చింతామణయే రత్నగర్భాయ మహాగణేశాయ స్వాహా"

ప్రయోజనము : ఈ ప్రకారాంత గణపతి మంత్ర సాధనవల్ల సకల మనోవాంఛలు సిద్ధించును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 2 లక్షల 50 వేలు
2. 1008 సార్లు ప్రతిరోజు కార్యసిద్ధి అగువరకు.

## 33. దశాక్షర గణేశ మంత్రము

"ఓం గం హుం శ్రీ గణేశాయ స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రసాధన వల్ల సకల సుఖభోగములు, ఉద్యోగ, వ్యాపారములందు అభివృద్ధి, శత్రువిజయం, సంతానవృద్ధి, సకల మనోవాంఛలు నెరవేరును. అపమృత్యుదోషములు, భూతప్రేత బాధలు తొలగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 10 లక్షలు
2. ప్రతిరోజు 1008 కార్యసిద్ధి అగువరకు.
3. 1 లక్ష 25 వేలు.

## 34. దశాక్షర గణేశ మంత్రము

"ఓం శ్రీం గం గజాననాయ స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రసాధన వల్ల సకల సుఖభోగములు, ఉద్యోగ, వ్యాపారములందు అభివృద్ధి, శత్రువిజయం, సంతానవృద్ధి, సకల మనోవాంఛలు నెరవేరును. అపమృత్యుదోషములు, భూతప్రేత బాధలు తొలగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 10 లక్షలు
2. ప్రతిరోజు 1008 కార్యసిద్ధి అగువరకు.
3. 1 లక్ష 25 వేలు.

## 35. హరిద్రా గణపతి మంత్రము

"ఓం హుం గం గ్లౌం హరిద్రా గణపతయే వరవరద సర్వ జన హృదయం స్తంభయ స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్ర సాధనవల్ల సకల మనోవాంఛలు సిద్ధించి ధర్మార్థకామ మోక్షములు లభించును. జపదీక్షలో పసుపు కొమ్ముచే చేయబడిన గణపతిని పూజించవలెను.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 3 లక్షలు

2. 1 లక్ష 25 వేలు

3. ప్రతిరోజు 1008 కార్యసిద్ధి అగువరకు.

## 36. ప్రసన్న గణపతి మంత్రము

**"ఓం వక్రతుండాయ హుం"**

ప్రయోజనము : ఈ మంత్రమును శుక్ల పక్ష చవితిని ప్రారంభించి 30 రోజులలో పూర్తి చెయ్యవలెను. ఈ మంత్రసాధన వల్ల సకల మనోవాంఛలు శీఘ్రముగా సిద్ధించును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 6 లక్షలు 30 రోజులలో.

## 37. గణపతి దశాక్షర మంత్రము

**"ఓం హ్రీం శ్రీం వినాయకాయ స్వాహా"**

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సకల దుఃఖ నివారణ కలుగును. విఘ్నములు నివారించును. సకల మనోవాంఛలు నెరవేరును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 10 లక్షలు

2. 1 లక్ష 25 వేలు

3. 1008 సార్లు ప్రతిరోజు కార్యసిద్ధి అగువరకు.

## 38. గణపతి దశాక్షర మంత్రము

**"ఓం లం శ్రీం లంబోదరాయ స్వాహా"**

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సకల దుఃఖ నివారణ కలుగును. విఘ్నములు నివారించును. సకల మనోవాంఛలు నెరవేరును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 10 లక్షలు

2. 1 లక్ష 25 వేలు

3. 1008 సార్లు ప్రతిరోజు కార్యసిద్ధి అగువరకు.

## 39. శక్తి గణపతి మంత్రము

**"ఓం హ్రీం గ్రీం హ్రీం"**

ప్రయోజనము : ఈ మంత్రసాధన వల్ల గొప్ప ఐశ్వర్యము, విద్య, కీర్తి, ధైర్యము, వాక్శుద్ధి కలుగును. రాత్రులందు బిల్వ వృక్షము క్రింద ఈ మంత్రమును జపించిన శీఘ్రంగా సిద్ధించును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 4 లక్షలు

2. 1 లక్ష 25 వేలు

3. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 40. ఋణవిమోచన గణపతి మంత్రము

**"ఓం గణేశ ఋణం ఛింది వరేణ్యం నమః ఫట్"**

**ప్రయోజనము :** ఈ మంత్రసాధన వల్ల సకల ఋణవిమోచనములు కలుగును. మనశ్శాంతి కలుగును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 1 లక్ష 50 వేలు

2. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 41. బాలగణేశ మంత్రము

**"ఐం ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గ్లం క్లీం గణపతీ వరద వరద సోః సర్వ జనం మే వశమానయ స్వాహా"**

**ప్రయోజనము :** ఈ మంత్రసాధనవల్ల బాల గణేశుని అనుగ్రహంతో సకల మనోవాంఛలు నెరవేరును. విద్య, ఉద్యోగములలో అభివృద్ధి కలుగును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 3 లక్షల 25 వేలు

2. 1 లక్ష 25 వేలు

3. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 42. గణేశ దశాక్షర మంత్రము

**"ఓం గౌం గం శూర్పకర్ణాయస్వాహా"**

**ప్రయోజనము :** ఈ మంత్రసాధనవల్ల ధనవృద్ధి, విద్యాభివృద్ధి, సంతాన లాభము, స్థిరలక్ష్మి ప్రాప్తి కలుగును. శత్రువుల బాధలు తీరును. అపమృత్యు దోషములు తొలగును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 10 లక్షలు

2. 1 లక్ష 25 వేలు

3. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 43. గణేశ దశాక్షర మంత్రము

**"ఓం క్లీం హ్రీం విఘ్ననాశనాయ స్వాహా"**

**ప్రయోజనము :** ఈ మంత్రసాధనవల్ల ధనవృద్ధి, విద్యాభివృద్ధి, సంతాన లాభము, స్థిరలక్ష్మి ప్రాప్తి కలుగును. శత్రువుల బాధలు తీరును. అపమృత్యు దోషములు తొలగును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1. 10 లక్షలు

2. 1 లక్ష 25 వేలు

3. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 44. సంపద్గణపతి మంత్రము

"ఓం శ్రీం గ్లాం హ్రీం ఓం శ్రీం హ్రీం క్లీం గ్లాం గం ఓం శ్రీం గ్లాం హ్రీం గణపతే వరద వరద ఓం శ్రీం గ్లాం హ్రీం సర్వ సమృదందేహి దేహి స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సకల ఐశ్వర్యములు సాధకునికి సిద్ధింపజేయును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 4 లక్షలు
2. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 45. శక్తి-గణపతి మంత్రము

"ఓం హ్రీం గం హ్రీం మహాగణపతయే స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సకల ఆపదలు తొలగి సాధకునికి విజయం కలుగును. ఈ మంత్రసాధన రాత్రి సమయంలో అమ్మవారి గుడిలో చేసిన త్వరగా సిద్ధించును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 1 లక్ష 30 వేలు
2. 3 లక్షలు
3. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 46. శక్తి-గణపతి మంత్రము

"ఓం హ్రీం గం హ్రీం మహాగణపతయే నమః"

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సకల ఆపదలు తొలగి సాధకునికి విజయం కలుగును. ఈ మంత్రసాధన రాత్రి సమయంలో అమ్మవారి గుడిలో చేసిన త్వరగా సిద్ధించును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 1 లక్ష 30 వేలు
2. 3 లక్షలు
3. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 47. విద్యాగణపతి మంత్రము

"ఓం బ్లూం ఓం శ్రీం హ్రీం క్లీం గ్లాం గం
ఐం బ్లూం గణపతే వరద వరద సర్వ విద్యాం దేహి దేహి స్వాహా"

ప్రతయోజనము : ఈ మంత్ర సాధనవల్ల సాధకునికి శీఘ్రంగా విద్యలందు అభివృద్ధి కలిగి సకల విద్యాప్రాప్తి కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 3 లక్షలు

2. 6 లక్షలు

3. ప్రతిరోజు 1008 సార్లు 108 రోజులు.

## 48. మహాగణపతి మంత్రము

"శ్రీం గం సౌమ్యాయ మహాగణపతయే వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్ర సాధనవల్ల గణపతి అనుగ్రహము వల్ల శీఘ్రంగా సకల మనోవాంఛలు నెరవేరును. సకల జనుల మన్ననలు కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 3 లక్షలు.

2. ప్రతిరోజు 1008 సార్లు 108 రోజులు.

## 49. మహాగణపతి మంత్రము

ఓం గం సౌర్యాయ మహాగణపతయే వర వరద సర్వజనం మే వశమానయ స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్ర సాధనవల్ల గణపతి అనుగ్రహము వల్ల శీఘ్రంగా సకల మనోవాంఛలు నెరవేరును. సకల జనుల మన్ననలు కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 3 లక్షలు.

2. ప్రతిరోజు 1008 సార్లు 108 రోజులు.

## 50. నవనీత గణపతి మంత్రము

"ఓం గ్లౌం నవనీత గణపతయే సర్వజనాన్మే వశమానయ స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సకల మనోవాంఛలు నెరవేరును. స్వామి వారి అనుగ్రహము వల్ల సకల సిద్ధులు కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 2 లక్షల 50 వేలు

2. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 51. విరి-విరి గణపతి మంత్రము

"హ్రీం విరి విరి గణపతే వర వరద సర్వలోకం మే వశమానయ స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సర్వజన వశీకరణ మనోవాంఛా ఫలసిద్ధి కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 2 లక్షల 60 వేలు

2. ప్రతిరోజు 1008 సార్లు 108 రోజులు.

## 52. క్షిప్రగణపతి మంత్రము (దశాక్షరీ)

"ఓం శ్రీం హ్రీం గ్లౌం గణపతయే సర్వకార్యసిద్ధిం కురు కురు స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సర్వ మనోవాంఛలు నెరవేరును. సర్వ విఘ్నములు తొలగును. శీఘ్రంగా కార్యసిద్ధి జరుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 2 లక్షలు

2. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 53. క్షిప్రగణపతి మంత్రము (దశాక్షరీ)

**"గం క్షిప్ర ప్రసాదనాయ నమః"**

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సర్వ మనోవాంఛలు నెరవేరును. సర్వ విఘ్నములు తొలగును. శీఘ్రంగా కార్యసిద్ధి జరుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 2 లక్షలు

2. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 54. సర్వసిద్ధికర గణపతి మంత్రము

**"ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం దాం హ్రాం గ్రీం క్లీం మహాగణాధిపతయే నమః"**

ప్రయోజనము : ఈ మంత్రసాధన వల్ల శీఘ్రంగా సాధకునికి మనోవాంఛలు నెరవేరును. సకల విఘ్నముల నుండి నివారణ కలుగును. ఇహపర లోక సౌఖ్యములు కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 2 లక్షలు

2. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 55. సిద్ధ గణపతి మంత్రము

**"ఓం శ్రీం హ్రీం సర్వకార్య విఘ్నప్రశమనాయ సర్వ రాజవశంకరాయ సర్వస్త్రీ పురుషాకర్షణాయ సర్వలోక వశీకరణాయ అం హ్రాం క్రోం హుం ఫట్ స్వాహా"**

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సర్వకార్య అనుకూలత, విఘ్నములు తొలగి అన్ని కార్యములందు విజయం, సర్వజన వశీకరణ కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 5 లక్షల 10 వేలు

2. 1 లక్ష 25 వేలు

## 56. సిద్ధ గణపతి మంత్రము

**"ఓం అం హ్రాం క్రోం శ్రీం హ్రాం గం సిం సిద్ధ గణపతయే! వరవరద సర్వకార్య సిద్ధిమ్ దాపయ దాపయ (కురుకురు) హ్రాం స్వాహా**

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సర్వకార్య అనుకూలత, విఘ్నములు తొలగి అన్ని కార్యములందు విజయం, సర్వజన వశీకరణ కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 5 లక్షల 10 వేలు

2. 1 లక్ష 25 వేలు

## 57. శక్తి గణపతి మంత్రము

**"ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం ఐం వదవద వాగ్వాదిని సిద్ధగగణపతయే గౌం భగవతి స్వాహా**

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల అమ్మవారు, మరియు గణపతి అనుగ్రహంతో సకల కార్య అనుకూలత కలుగును. ఉద్యోగ వ్యాపారములందు అభివృద్ధి కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 3 లక్షలు

2. 1 లక్ష 25 వేలు

3. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 58. శక్తి గణపతి మంత్రము

**ఓం హ్రీం గం హ్రీం మహాగణపతయే స్వాహా**

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల అమ్మవారు, మరియు గణపతి అనుగ్రహంతో సకల కార్య అనుకూలత కలుగును. ఉద్యోగ వ్యాపారములందు అభివృద్ధి కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 3 లక్షలు

2. 1 లక్ష 25 వేలు

3. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 59. వీర గణపతి మంత్రము

**"ఓం హ్రీం క్లీం వీర వరగణపతయే వః వః ఇదం విశ్వం మమవశమానయ ఓం హ్రీం ఫట్"**

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సకల విఘ్నములు నశించి సకల జన వశీకరణ జరుగును. మనోవాంఛలు సిద్ధించును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 3 లక్షలు

2. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 60. వరద గణపతి మంత్రము

**"ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా"**

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సకల మనోవాంఛలు నెరవేరును. సకల సంపదలు కల్గి, సకల జనవశీకరణ జరుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 3 లక్షలు

2. ప్రతిరోజు 1008 సార్లు కార్యసిద్ధి అగువరకు.

## 61. విషహరణ వినాయక మంత్రము

"ఓం హ్రీం గణేశాయ నమః ఓం హ్రీం స్తంభనాది చక్రాయ నమః ఓం ఐం బ్రహ్మైస్త్రైలోక్యడామరాయ నమః"

ప్రయోజనము : ఈ మంత్రమును 10 వేలు జపించి, యవలను (లేక) భస్మమును ఈ మంత్రములో 108 సార్లు అభిమంత్రించి ఇంటిలోను, చుట్టు ప్రక్కల చల్లిన భూత, ప్రేత, సర్ప బాధలు గాని వుండవు. ఈ మంత్రసాధన వల్ల సకల విష జంతువుల నుండి రకణ కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1.

## 62. విషహరణ వినాయక మంత్రము

"ఓం హ్రీం గణేశాయ నమః"

ప్రయోజనము : ఈ మంత్రమును 10 వేలు జపించి, యవలను (లేక) భస్మమును ఈ మంత్రములో 108 సార్లు అభిమంత్రించి ఇంటిలోను, చుట్టు ప్రక్కల చల్లిన భూత, ప్రేత, సర్ప బాధలు గాని వుండవు. ఈ మంత్రసాధన వల్ల సకల విష జంతువుల నుండి రకణ కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1.

## 63. గణపతి శాంతిక మంత్రము

"ఓం భద్రం కర్ణేభి శృణు యామదేవాః
భద్రం పశ్యే మాక్ష భిర్య జత్రాః
స్థిరై రంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః
వ్యశేమ దేవ హితం మదాయుః
స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినపూషా విశ్వవేదాః
స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమః స్వస్తినో బృహస్పతి ర్దధాతు"

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల యుద్ధభయముల నుండి రక్షణ కలుగును. సకల ఉపద్రవములు అంతరించి శాంతి కలుగును. సకల శుభ ఫలితములు కలుగును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. 1 లక్ష 25 వేలు
2. ప్రతిరోజు నియమిత సంఖ్య

## 64. కార్యసిద్ధి గణపతి మంత్రము

"సుముఖశ్చైకదంతశ్చ కపిలోగజకర్ణిక లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిప ధూమకేతుర్గణాధ్యక్ష ఫాలచంద్రో గజాననః వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబ స్కందపూర్వజః"

ప్రయోజనము : ఈ మంత్రసాధనవల్ల సకల విఘ్నములు తొలగి సకల కార్యసిద్ధి చేకూరును. ఏదైన పనిమీద బయటకు వెళ్ళుతున్నప్పుడు 16 సార్లు చదువుకుని వెళ్ళిన కార్యము సిద్ధించును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. 1. ప్రతిరోజు 108 సార్లు

2. ప్రతిరోజు 1008 సార్లు 40 రోజులు.

## 65. గణపతి మంత్రము

ఓం హ్రీం శ్రీం గం గణపతయేస్వాహా!

ఓం నమో భగవతే ! వక్రతుండాయ

మహాగణపతయే! అం హ్రీం క్రోం, హ్రీం

గం శ్రీం సర్వజనముఖహృదయ

రంజనమ్ కురు కురు స్వాహా ॥

ప్రయోజనము:- గృహ వాస్తు దోషములు నివారణ.

మంత్రసిద్ధి: 1,20,00 జపము

## 66. గణేష మంత్రములు

1. ఓం ఏకదంతాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి

తన్నోదంతిః ప్రచోదయాత్

2. ఓం తత్పురుషాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి

తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

3. ఓం మహాకర్ణాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి ।

తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

4. ఓం తత్కరాటాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి ।

తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

5. ఓం లంబోదరాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి ।

తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

6. ఓం మహోల్కాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి ।

తన్నో దంతిః ప్రచోదయాత్ ॥

7. ఓం ఆఖువాహనాయ విద్మహే, వక్రతుండాయ ధీమహి।
   తన్నో దంతి ప్రచోదయాత్ ॥
8. ఓం గణంజయాయ విద్మహే, కామహంతాయ ధీమహి।
   తన్నో దంతి। ప్రచోదయాత్।
9. ఓం మయూరవాహనాయ విద్మహే, కామహంతాయ ధీమహి।
   తన్నో వికటః ప్రచోదయాత్।
10. ఓం క్రోధహంతాయ విద్మహే, శక్తి బ్రహ్మాయ ధీమహి।
   తన్నో లంబోదరః ప్రచోదయాత్ ॥
11. ఓం ఆఖువాహనాయ విద్మహే, లోభహంతాయ ధీమహి।
   తన్నో గజాననః ప్రచోదయాత్ ॥
12. ఓం జ్ఞాన బ్రహ్మాయ విద్మహే, మోహహంతాయ ధీమహి।
   తన్నో మహోదరః ప్రచోదయాత్ ॥
13. ఓం ఆఖువాహనాయ విద్మహే, మదహంతాయ ధీమహి।
   తన్నో ఏకదంతః ప్రచోదయాత్ ॥
14. ఓం సింహవాహనాయ విద్మహే, మాత్సర్యహంతాయధీమహి
   తన్నో వక్రతుండః ప్రచోదయాత్ ॥
15. ఓం విష్ణురూపాయ విద్మహే,మమతాహన్తాయ ధీమహి।
   తన్నో విఘ్నరాజః ప్రచోదయాత్ ॥
16. ఓం శివాత్మకాయ విద్మహే,అభిమానహన్తాయ ధీమహి।
   తన్నో ధూమ్రవర్ణః ప్రచోదయాత్ ॥
17. ఓం తత్పురుషాయ విద్మహే వక్రతుండాయధీమహి।
   తన్నో దన్తిః ప్రచోదయాత్ ॥
18. ఓం తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి।
   తన్నో దంతి। ప్రచోదయాత్ ॥
19. తత్పురుషాయ విద్మహే శక్తియుతాయ ధీమహి
   తన్నో దన్తిః ప్రచోదయాత్
20 .దశ భుజాయ విద్మహే వల్లభేశాయ ధీమహి
   తన్నో దన్తిః ప్రచోదయాత్
21. తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నో
   విఘ్నః ప్రచోదయాత్

22. అఖుధ్వజాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నో
విఘ్న ప్రచోదయాత్

23. ఓం విఘ్నరాజాయ విద్మహే
వక్రతుండాయ ధీమహి
తన్నో దంతిః ప్రచోదయాత్

24. ఓం తత్పురుసాయ విద్మహే
వక్రతుండాయ ధీమహి
తన్నో దంతిః ప్రచోదయాత్

25. "ఓం ఏకదంతాయ విద్మహే।
వక్రతుండాయ ధీమహి।
తన్నో దంతిః ప్రచోదయాత్।

26. ఓం తత్పురుషాయ విద్మహే।
వక్రతుండాయ ధీమహి।
తన్నో దంతిః ప్రచోదయాత్।

27. ఓం లంబోదరాయ విద్మహే।
మహోదరాయ ధీమహి।
తన్నో దంతిః ప్రచోదయాత్।

28. ఓం విఘ్నరాజాయ విద్మహే।
హస్తిముఖాయధీమహి।
తన్నో దంతిః ప్రచోదయాత్

29. ఓం మహోల్కాయ విద్మహే।
వక్రతుండాయ ధీమహి।
తన్నో దంతిః ప్రచోదయాత్।

30. ఓం అఖుధ్వజాయ విద్మహే।
వక్రతుండాయ ధీమహి।
తన్నో విఘ్నః ప్రచోదయాత్।

ప్రయోజనము : ధర్మ, అర్థ, కామ, మోక్షములు గణేశ గాయత్రీ మంత్రజపము వల్ల లభించును. సమస్త సంపదలు, మేధాశక్తి, మనోవాంఛలు నెరవేరుట, విఘ్నములు తొలుగుట కల్గును.

మంత్రసిద్ధి : జపసంఖ్య. ప్రతిరోజు 1008 : 40 రోజులు



# శ్రీ సుబ్రహ్మణ్య మంత్రములు



# శ్రీ సుబ్రహ్మణ్య మంత్రములు

## 1. శ్రీ సుబ్రహ్మణ్య మంత్రము

**"ఓం శ్రీం క్లీం హ్రీం ఐం ఈం సం శం సొం శరవణభవ"**

**ప్రయోజనము :** ఈమంత్రజపము వల్ల ఆరోగ్యము, సంతానప్రాప్తి, సిరిసంపదలు కలుగును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. ప్రతిరోజు 5000సార్లు : 40 రోజులు

## 2. కుమారస్వామి మంత్రము

**"ఓం హాం కుమారాయ నమః స్వాహా"**

**ప్రయోజనము :** ఈమంత్రమును పిల్లలు పుట్టి చనిపోవుచున్న వారినుద్దేశించి జప మాచరించిన వారికి ఆరోగ్యవంతుడు, దీర్ఘాయుర్దాయవంతుడు అగు కుమారుడు కల్గును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1 లక్ష 25 వేలు

## 3. శ్రీ శరవణభవ మంత్రము (అష్టాక్షరి)

**"ఓం సొం శరవణభవ" (8 అక్షరాలు)**

**ప్రయోజనము :** ఈ మంత్రసాధన వల్ల దీర్ఘవ్యాధులు తొలగి, భూత ప్రేత పిశాచాది గ్రహబాధలు తొలగును. నాగశాపాదులు, పూర్వజన్మ కర్మ దోషములు, సమస్త దోషములు నివారించును. వంధ్యాదోషములు, సంతాననష్టములనుండి కాపాడి ఆరోగ్యవంతమైన సంతానము కలుగును. స్వామి అనుగ్రహం వల్ల సత్సంతానం, ఆరోగ్యం, ఐశ్వర్యము, సర్వవిధముల అభివృద్ధియునూ ప్రాప్తించును.

**మంత్రసిద్ధి :** జపసంఖ్య. 1 లక్ష 25 వేలు.

## 24. సుఖ ప్రసవ మంత్రము

"ఓం యుక్తాః పాశా విముక్తాశా యుక్తాః సూర్యేణ రశ్మయః ముక్తాః సర్వభయాద్గర్భ ఎహిమా చిర మాచిర స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్రముతో నీళ్ళను 8 సార్లు అభిమంత్రించి ప్రసవ వేదనతో బాధపడుతున్న స్త్రీ చేత త్రాగించిన సుఖప్రసవము అగును.

## 25. ఆహారజీర్ణ మంత్రము

"అగస్త్యం కుంభకర్ణంచ శమ్యంచ బడబానలం ఆహార పాచనార్థాయ స్మరేద్భీమంచ పంచమం"

ప్రయోజనము : ఈ మంత్రమును భోజనానంతరం చేత్తో పొట్టను తడుముతూ 11 సార్లు జపించిన ఆహారం త్వరగా జీర్ణమగును.

## 26. అన్నాధిపతి మంత్రము

"గ్లౌం అన్నం మహ్యమన్నం మే దేహి అన్నాధిపతయే మమ అన్నం ప్రదాపయ స్వాహా గ్లౌం"

ప్రయోజనము : ఈ మంత్రసాధన వల్ల సాధకుడు ఎల్లప్పుడూ పంచభక్ష్య భోజనములు ఆరగించుచు భోజన ప్రియత్వం కలిగి ఉండును. ఈ మంత్రమును 10 వేలు జపించిన తరువాత ప్రతిరోజు 108 సార్లు జపించవలెను.

## 27. ధాన్య (వరి) వృద్ధి మంత్రము

"ఓం వృక్ష రాజ సమృద్ధస్త్వం త్రిషులోకేషు వర్తసే
కురుష్వ ధాన్యవృద్ధింత్వం క్షేత్రే కీటీదిర్జితా"

ప్రయోజనము : ఈ మంత్రముతో అభిమంత్రించిన మోదగ బదనికను ఇంటిలో భోజనం చేసే చోటకాని, ధాన్యపు కొట్టులో కాని, బియ్యం నిల్వ ఉంచేచోటకాని స్థాపించవలెను.

**సాధనాపద్ధతి :** హోలీ పండుగ ముందురోజు సాయంకాలము మోదుగ చెట్టుకు పూజ పురస్కారములు చేసి తీపి పదార్థములు నైవైద్యంగా పెట్టి నిమంత్రణ చెప్పి తెల్లవారుజామున మరల పూజచేసి నైవైద్యం పెట్టి ధూపం వేసి బదనికను తీసుకొని 108 సార్లు అభిమంత్రించి ఇంటిలో స్థాపించుకొనవలెను.

## 28. పంటలు బాగా పండుటకు మంత్రము

"ఓం నమో భగవత్యై ధరత్యై ధరణీధరే స్వాహా"

ప్రయోజనము : ఈ మంత్ర సాధన వల్ల భూమిలో పంటలు బాగా పండును. భూవిధ పనులందు సంపదలు కలుగును.





మంత్రసిద్ధి : జపసంఖ్య 25,000 జపించి 10 రోజులలో, తరువాత రోజూ 108 సార్లు జపించుచుండవలెను.

## 29. అగ్నిస్తంభన మంత్రం

ఓం నమో అగ్నిరూపాయ మమ శరీరే స్తంభ నం కురు కురు స్వాహా।

ప్రయోజనము: అగ్ని స్థంభన సిద్ధిస్తుంది.

మంత్రసిద్ధి: 12 లక్షలు జపం

## 30. యుద్ధ స్తంభన మంత్రం

ఓం నమో భగవతే శత్రూణా బుద్ధి స్తంభయ స్తంభయ స్వాహా

ప్రయోజనము: శత్రు అస్త్రములు వలన భయము ఉండదు.

మంత్రసిద్ధి: 1,25,000

## 31. యుద్ధ స్తంభనము మంత్రము

ఓం అహో కుంభకర్ణ మహారాక్షస నికషాగర్భసంభూత పరసైన్యం స్తంభయ మహాభగవాన్ । రుద్రోపిజయంతి స్వాహా.

ప్రయోజనము: శత్రు అస్త్రములు వలన భయము ఉండదు.

మంత్రసిద్ధి: 1,25,000

## 32. శత్రు నాశకర మంత్రము

ఓం నమో భయంకరాంకు ఖడ్గధారిణే మమ శత్రుసైన్యం పలాంకులనం కురు కురు స్వాహా

ప్రయోజనము: శత్రువులు పూర్తిగా నశిస్తారు.

మంత్రసిద్ధి: 1 లక్ష 25 వేలు

## 33. గర్భ స్తంభన మంత్రము

ఓం గర్భమ్ స్తంభయ స్తంభయ స్వాహా

ప్రయోజనము: గర్భము నిలుచును

మంత్రము: 1 లక్ష జపము, మెడలో వ్రాసి ధరించాలి.

## 34. విద్వేషణ మంత్రము

ఓం నమో నారయణాయ అముకుం అముకేన
సహ విద్వేషం కురు కురు స్వాహా

ప్రయోజనము: ఇద్దరి మధ్య గొడవలు తీసుకునివస్తుంది.

మంత్రసిద్ధి: 25 వేలు జపము.

### 35. స్త్రీ వశీకరణ మంత్రము

ఓం నమః కామాఖ్యాదేవి అముకీం మే వశం కురు కురు స్వాహా
ప్రయోజనము: స్త్రీ వశీకరణ జరుగును.
మంత్రసిద్ధి: 1 లక్ష 25 వేలు

### 36. పురుష వశీకరణ మంత్రము

ఓం మహాయక్షిణీ పతిం మే వశ్యం
కురు కురు స్వాహా
ప్రయోజనము: పురుష వశీకరణ జరుగును.
మంత్రసిద్ధి: 1 లక్ష 25 వేలు

### 37. రాజ వశీకరణ మంత్రము

ఓం నమో భాస్కరాయ త్రిలోకాత్మనే
అముక మహీపతిం మే కురు కురుస్వాహా
ప్రయోజనము: రాజ వశీకరణ జరుగును.
మంత్రసిద్ధి: 1 లక్ష 25 వేలు

### 38. పుత్రప్రాప్తి మంత్రము

ఓం హ్రాం హ్రీం హ్రూం పుత్రం కురు కురు స్వాహా
ప్రయోజనము: సంతానము కలుగును.
మంత్రసిద్ధి: 1 లక్ష 25 వేలు

### 39. భూత గ్రహనివారణ మంత్రం

ఓం నమః శ్మశానవాసినే భూతాది పలాయనం కురు కురు స్వాహా!
ప్రయోజనము: భూతగ్రహ బాధ నివారణ జరుగును.

### 40. వాజీకరణ మంత్రము

ఓం నమః అముకస్య బల పరాక్రమం కురు కురు స్వాహా. (అముక స్థానంలో పేరు చెప్పుకోవాలి)
ప్రయోజనము: బలపరాక్రమములు పొందగలరు.
మంత్రసిద్ధి: 18,000 వేలు జరుగును.

### 41. ఆకర్షణ మంత్రము

ఓం నమః కాళికాయై సర్వాకర్షణ్యై అముకీం (పేరు)
ఆకర్షయ ఆకర్షయ శీఘ్రమానయ
ఐం హ్రీం క్లీం భద్రకాళ్యై నమః (42 అక్షరాలు)
ప్రయోజనము: ఆకర్షణ పొందుటకు
మంత్రసిద్ధి: 42 వేలు